Reg. No. 757.

# అభినవసరస్వతి

యనునొక మాసపత్రిక

అష్టావధాని జనపాటి పట్టాభిరామశాస్త్రిచే

ప్రచురింపఁబడుచున్నది.

జనపాడు.

సంపుటము 16 { 1924 సం॥ మే. } సంచిక 2

విషయములు.





చందానిర్ణయము సంవత్సరమునకు.

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25 0 0 | సహాయులకు | రు 5 0 0 |
| పోషకులకు | రు 10 0 0 | చందాదారులకు | 8 0 0 |

Printed at the Chandrika Press, Guntur,
and published at Janapadu by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry.

## ఈసంవత్సరము చందా దయచేసిన పోషకులు

౧ సూదూరి వీరసాంబశివరావు సర్దేశపాండ్యాగారు, సూనెకొండూరు.

౨ ఎనమండ్రి లక్ష్మీనరసింహము గారు, మర్చెంటు, బెజవాడ.

౩ రాజా వెంకటాద్రప్పారావు, బహదరుగారు, వుయ్యూరుయెస్టేటు.

౪ రాజామంత్రిప్రెగడ వెంకటహనుమంతరావు, రాఘవరావుగార్లు, శింగగిరి.

## సహాయులు.

౧ వావిళ్ల వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము.

౨ పెద్దిభట్ల వీరయ్యగారు, ప్లీడరు, బెజవాడ.

౩ కానుమాను హనుమయ్యగారు, నర్సారావుపేట.

౪ నడింపల్లి నరసింహారావుగారు, జిల్లా రిజిస్ట్రారాఫీసు, గుంటూరు.

౫ గోటేటి వేణుగోపాలరావుగారు, పోలీసుసబిన్స్పెక్టరు, ప్రత్తిపాడు.

౬ రాచకొండ వెంకట్రామయ్యగారు, యెనమదల.

# చందాదారులు.

౧ రాచకొండ శివన్న సోమయాజులుగారు, చమళ్ళమూడి.

౨ రాచకొండ యజ్ఞనారాయణగారు, కరణము, గారపాడు.

౩ రామరాజు రామమూర్తిగారు, కరణము, గొట్టిపాడు.

౪ సీతారామ భాండాగారము, కండిబండ.

౫ కంచిరాజు శంభయ్యగారు, కరణము, మల్లారెడ్డిగూడెము.

౬ రాళ్ళభండి రాజయ్యగారు, విలేజిమున్సిఫ్, చింతిరాల.

౭ చివుకుల వెంకటశాస్త్రిగారు, దేవస్థానముమానేజరు, తిరుపతి.

౮ మండ చిన వెంకయ్యగారు, దండమూడి.

౯ చతుర్వేదుల నరసింహయ్యగారు, నిప్పులపల్యాగ్రహారము.

౧౦ దంటు లక్ష్మీకాంతరావుగారు, సుద్దపల్లి.

జ్ఞానలవదుర్విదగ్ధం బ్రహ్మాపి నరం న రంజయతి.

వీరిసంఖ్యయే ప్రకృతము బలమైనది. ప్రతివిషయమునను వీరికోలాహలమే యెక్కువైనది. వీరి నిరంజింపఁజేయ బ్రహ్మదేవుఁడుకూడ సమర్థుఁడు కాకయుండ నింక నెవరు రంజింపఁజేయఁగలరు. ఈతరగతివారికిఁ బండితులు చేసిన నాటకములు పనికిరావు. స్వనాటకములు ప్రదర్శింపఁబడఁజూడవలెనన్న కోరిక పండితులకుండుచోఁ బూర్వోక్తులు పడుచున్న పాట్లఁబడి వారి యిష్టమునచ్చినట్లు మార్పు చేయవలెను. అప్పుడుగాని వీరు ప్రదర్శింపరు. ఈయంశమును "బయస్కోపు, ప్రదర్శనములననుసరించి కాలక్షేపము చేయు నిప్పటి నాటకపుఁగంపెనీలవారివలనుండిన యుత్తమోత్తములగు నాంధ్రీకృతోత్తరరామచరితముల నాడుటకే వెనుకాడుచున్నప్పుడు నాయాంధ్రీకరణమును మాత్రము ప్రదర్శింతురా?" యను లక్ష్మీకాంతకవిగారి పంక్తులే ధ్రువపఱచుచున్నవి. నాగరికుఁడై చిన్నతనమునుండియుఁ బ్రదర్శనానుకూలనాటకములు వ్రాయుచుఁ బ్రదర్శింపఁజేయుచున్న యీకవికే యీకాలమున కీనాటకపుఁగంపెనీలవారిపై నిట్టియనుమానముగలిగి యీమొదలగువిధమున వ్రాయుచుండ మాబోటుల నాటకములు ప్రదర్శింప వెనుకాడుటంగూర్చి విచారింప ననవసరము.

యథాపూర్వముగ నంతకుమున్నుత్తరరామాయణకథను స్వతంత్రనాటకముగా రచించియున్నదియు సంస్కృతభాషాపరిచయముచేసి యాభాషయందలి యాయలంకారములు నాధ్వనులు నావ్యంగ్యములు నాశ్లేషలు చూచినకొలఁది తదభిరుచి మొదలగుటయుఁ బ్రాచీనసరణులకన్న నవనాగరికసరణు లెక్కువగావని భావించి భవభూతిమహాకవి రచించిన యుత్తరరామచరితమును దెనిఁగింపఁజొచ్చితిని. అట్లు తెలిఁగింపుచు నందలి పద్యములు ప్రదర్శకులును నవనాగరికులును నగు పూర్వస్నేహితులకు వినిపించుటయు నయ్యవి వారి మనంబుల కంతగా రుచింపక స్వతంత్రనాటకప్రచురణమునకే ప్రోత్సాహపఱుప నటు నిటు గాకుండ రెంటెని మెళవుంచి ముద్రించియున్నవారు. దానుహా నీయున

కవిత్వ మతిప్రౌఢమును రసవంతమును నిర్దుష్టమును లలితపదసంఘటిత మునై పండితమండలి కఖండసంతోషము గలిగించుచున్నది. పాశ్చాత్యులను గేవలగద్యమునే కావలయుననికోరు నీకాలపుకొన్ని నాటకపుం గంపెనీలవారి కైనను నున్నతభావసమన్వితములై విద్వన్మనోరంజకంబు లగు నిందలి పద్యంబులు విద్యాసక్తిచేఁ జదువవలయుఁగాని రుచింపక పోవు. శంబూకవధ సందర్భమున నీ పద్యములఁ దిలకింపుఁడు.

చం॥ ఎఱుఁగనివాఁడఁగాను జగదీశ్వర! యీయుగధర్మమర్మమే,
నెఱుఁగనివాఁడఁగాను మనుజేశ్వర! నీవు రమేశ్వరుండవం,
చెఱుఁగనివాఁడఁగాను దప మిట్టిది మాకువిపర్యయంబటం,
చెఱిఁగియెఱింగి నీవలన నే మృతిగోరి తపంబుచేసితిన్

చం॥ మనుమార్గంబిది యౌను దక్షిణకరంబా! విప్రసంతానమున్
మనుమార్గంబిది కాన శూద్రమునిపైనం జిమ్ము కౌక్షేయక
మ్మనుమానింపక, జానకిన్ సుగుణధన్యన్ నిందచూలాలి నే
వనిమానంగల రాముగాత్రమవు కావా? జాలి యింకేటికిన్.

మ॥ నిను సర్వేశు, జగచ్ఛరణ్యు ఘను ల ♦ న్వేషింతు రట్లయ్యు, నీ
వెనితాంతశ్రమకోర్చి శూద్రునను న ♦ న్వేషించుచున్ నాఁడుయో
జనము ల్వచ్చుటయేదియో యది తప ♦ స్సాఫల్యమే కానిచో,
ననఘా! వెండియు దండకాటవి కయో ♦ ధ్యన్ దాఁటి రానేటికో॥

ఈపద్యములు లక్ష్మీకాంతముగారి కవితాసారస్యమును దెలుపుట యేకాక ధర్మరహస్యములఁగూడఁ దెలుపుచున్నయవి. శూద్రులగు మాకిట్లు తపంబుండుట తగదనుసంగతి నాకుఁ దెలియకయుండ లేదుకాని! యిట్టి యకార్యకరణమున దిగినఁగాని నీచేత మరణము ఘటిల్లదనియు నప్పుడుగాని నా కుత్తమలోకప్రాప్తి కలుగదనియు శూద్రుఁడగు శంబుకుఁడు చెప్పినవాక్యములే ధర్మజిజ్ఞాసువులగు శూద్రుల కెంతనీతినిబోధించుచున్నవో పరికింపుఁడు. ఈగ్రంథమునం దాంధ్రీకరణభాగముచూచిన నితఃపూర్వాంధ్రీకరణములకన్న నన్నివిధం

బుల విన్నగాఁగను పెట్టెడిని. కనుఁగొనుఁడు

భవభూతిమూలము.

శ్లో॥ ఆవివాహసమయాద్గృహేవనే శైశవే తదనుయావనే పునః
స్వాపహేతురనుపాశ్రితోన్యయా రామబాహురుపధానమేష తే

దీనికి వెంకటరామకృష్ణకవుల తెలిఁగింపు!

తే॥ జనకజా నిన్నుఁ బెండ్లియాడినది మొదలు
భవనమునఁగాననంబున బాల్యమందు
జవ్వనమునఁదలాడఁగా సంతరించు
నదియిదిగొ రామబాహువున్నదియె కాదె

లక్ష్మీకాంతకవిగారియాంధ్రీకరణము

చం॥ కలనయినన్ బరాంగనను ♦ గాక వివాహము యాదిగా భవ
ల్లలిత తనూపలాలన వి ♦ లాసము భానుభవ ప్రశస్తమై
చెలువ! గృహంబునన్ గహన ♦ సీమల నిన్నుచితంపుసేవలన్
గొలిచెడి రామబాహు విడి ♦ గో తలదిండగు నీకు జానకీ!॥

ఇందలి పద్యములన్నియు నొకటిమించి యొకటికడుంగ హృద్యములుగా గానుపించెడి శైలికై కొన్ని పరికింపుఁడు.

శా॥ ఆనాఁడంతపరీక్షతోఁదెలియ లే ♦ దా? పాపమో పుణ్యమో
ఆనిర్ణాయకులిప్పుడేమయిరి? లేఁ ♦ డా వేల్పుఱేఁ, డగ్నిలేఁ
డా, నీరేజభవాది దేవతలు లే ♦ రా? నారువీరేల లే
దా నన్నింతకునేలు నాపతి మనస్సాక్ష్యంబు సల్లక్ష్యమై॥

మ॥ పుడమిన్ లోకులయందుఁ దత్తనుచితం ♦ పుంగర్మముల్ నీతిమై
నడిపింపంగల తేఁడె యున్నయెడ నా ♦ నా యుట్టిమర్యాద లె
న్నఁడు మున్విన్నవిగావు ధర్మముడుగం ♦ టన్ బుట్టె నీ నాఁటి కీ
కడుపుంగోఁతలు, రామభూవిభు కటా ♦ క్షుం బేమనన్ భామినీ॥

దీని వెల. 1—4—0

వలయువారు:— బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారు, గుంటూరు.

అని వ్రాయవలెను.

## పీఠసంగ్రహచరిత్రవిమర్శనము.

శ్రుతిధర్మసంజీవినీ పత్రికాధిపతులగు శివపురపు వీరభద్ర పాకయాజిగారు లసంవత్సరములో నొకమాఱును రుధిరోద్గారి సం॥లో నొకమాఱును శ్రీశృంగేరి శ్రీవిరూపాక్ష సంస్థాన శ్రీపీఠసంగ్రహచరిత్రమని యొకటి ప్రచురించిరి. అందు మొదటిది విరూపాక్షపీఠాధ్యక్షులను రెండవది పుష్పగిరిపీఠాధ్యక్షులను దూషణభాక్కులం గావించుచున్నయవి. అందుపై విరూపాక్షస్వాములవారి న్యాయవాదులును రాజమహేంద్రవర పురనివాసులును నగు యన్. వెంకటరామయ్యగారు 25-7-1916వ తారీఖునం బాకయాజిగారి కీక్రింది నోటీసునుబంపియుండిరి.

"మహారాజరాజశ్రీ శివపురపు వీరభద్రపాకయాజిగారికి,

మఠాధిపతులైన శ్రీశ్రీ జగద్గురు శృంగగిరి హంపి విరూపాక్ష స్వాములవారు నాకొసంగిన యుత్తరువుప్రకారము నేను మీ కీక్రింది నోటీసు నిచ్చుచున్నాను.

మీరును నాగం కృష్ణరాయశర్మగారును గలిసి యొకపుస్తకమును శ్రీపీఠసంగ్రహచరిత్రమను పేరుతోం బ్రచురించినారు. అది బోధానందభారతీస్వామి శ్రీ విరూపాక్షపీఠాధిపతి యనుటయేకాక మఠాధిపతుల కపయశస్కరమైన నింద గావించుచున్నది.

1 అందు హంపీవిరూపాక్షపీఠ మబద్ధమైనదనియు బోధానంద భారతీస్వామి కేవలసాక్షివాక్యములే యాధారముగాం గైకొనిన రాజమహేంద్రవరము డిస్ట్రిక్టుమున్సిఫ్‌కోర్టు తీర్మానించిన న్యాయములకుం బాత్రమయ్యెననియు నందువలననే యపీలటుకోర్టుగూడ నట్టినిర్ధారణ సూచించుచున్నదనియుం బ్రచురించితిరి.

2 హంపీస్వామి విరూపాక్షపీఠాధిపతియొక్క శిష్యులలో నొకరుమాత్రమనియు నాయనకుం బీఠాధికారములేకుండ సంచారము

చేయుట కాజ్ఞయీయఁబడినదనియు మఱియు "శ్రీవిద్యాశంకర దేవదివ్య పాదపద్మారాధక" యనుబిరుదాయనను బీఠాధిపతి కాఁడని స్పష్టముగాఁ దెలుపుచున్నదనియు నిట్లుప్రాతయధికారపత్రికలవలనఁ దెలియఁబడినదనియుఁగూడ మీరు ప్రచురించితిరి. ఈప్రచురించినవాక్యముల కాధారము లేదు. సబ్ కోర్టు జెడ్జిమెంటు 48వ పేరాలో "సామాన్యముగా నీవిషయములనుబట్టి యూహించిచూడఁగా 1వ ప్రతివాది (బోధానంద భారతి) చెప్పినప్రకారము హంపీస్వామివారి యధికారము తెనుఁగు పరగణాలవఱకే స్థాపింపఁబడియున్నట్లయిన హంపీలో పీఠమును స్థాపించియుండవచ్చునని నమ్ముటకుఁ గొంతవఱకుఁ గష్టమైయున్నది కావున నుద్దండభారతీస్వాములవారివలనఁ బీఠాధిపత్యము లేకుండఁ దెనుఁగుదేశములో సంచారము చేయుట కనుమతింపఁబడినది దావాపీఠముయొక్క మొదటిస్వామియే యని మనము వాదింపవచ్చును. దావాపీఠమునకు మఠముగాని యెట్టియాస్తిగాని లేదను నిశ్చయార్థమైన యంశ మీ విషయమున కాధారమైయున్నది. కాని దావాపీఠముయొక్క ఫలమును బాధించునుగనుక నీవిషయములో నా స్థిరమైన యుద్దేశ మీయ"నని యిట్లు సబ్ జెడ్జి తీర్పునిచ్చియున్నాఁడు. బిరుదునుగుఱించి యపీలటుకోర్టుయొక్క తీర్మానము 54వ పేరా నీవు చెప్పినది యబద్ధమని తెలుపుచున్నది.

3 హంపీస్వామిపీఠ మబద్ధమైనదని తెలుపుచు శ్రీవిరూపాక్షపీఠముయొక్క కథ నొకదానిని బ్రచురించితిరి. అది మిథ్య, నిరాధారమైనది. మఱియు నపీలటుకోర్టువారు దానిని దీసివేసిరి. అపీలటుకోర్టు తీర్మానములోని 55వ పేరాలో

"ప్రతివాదిపక్షమునుండి దాఖలుచేయఁబడిన రికార్డును జాగరూకతతోఁ బరిశీలించి చూడఁగా మొదటిప్రతివాది నిజమైనసంగతులు విచారింపకయే తనకే తెలియనటువంటి కొన్ని యాధారపత్రములను

దొరకినంతవఱకు శ్రద్ధతోఁ జేర్చి యీ విషయమున నిర్మాణముచేసి నట్లు నాకుఁ గనఁబడుచున్నది. దాఖలుచేసినటువంటి రికార్డునుబట్టి చూడ దావామఠముయొక్క నిజమైనచరిత్ర నిర్మాణము చేయుటకు శక్యముకా" దని న్యాయాధిపతి యిట్లు చెప్పియున్నాఁడు.

4 దావాపీఠమునకుఁజెంది సిద్ధిపొందియున్న స్వాములవారిచేసిఁ బడిన విల్లునుగుఱించి యపీలటుకోర్టు విసర్జించినటువంటి మునిసీఫు కోర్టుయొక్క తీర్మానమును బ్రచురించితిరి. అపీలటుకోర్టుతీర్మానమును దాఁచితిరి. అపీలటుకోర్టుతీర్మానములోని 61 వ పేరాలో "ఈవిషయములోఁ దీర్మాన మవసరమైనట్లయితే మొదటిప్రతివాదికి వ్రాసియిచ్చినదియో లేక చెప్పినదియో యనెడి విల్ తృప్తికరముగా స్థిరపఱుపలే" దని యిట్లు చెప్పఁబడియున్నది కదా! 62 వ పేరాలో "మతాచారప్రకార మీదావామఠస్వామి కితరులయందుఁ దనహక్కుల నియమించుట కధికారమున్నదని చూపించుటకుఁ గించిత్తాధారమైనను లేదు గనుక నేను దీని నమ్మ"ననియు నుదాహృతము. మీరు సబార్డినేటు జడ్జీయొక్క తీర్మానమును దొక్కివేసితిరి. మఱియు, మీపుస్తకము యొక్క 28 వ పేజీలో విల్లులవిషయమై మునిసీఫుకోర్టుయొక్క తీర్మానమును జడ్జి స్థిరపఱచిన ట్లొక యుద్దేశము జనులకుఁ గలుగుటకుఁ గొన్ని దస్తావేజులవిషయమై సబార్డినేటుజడ్జీయొక్క నమ్మకమును గుఱించి తీర్మానము నిచ్చితిరి.

5 మీపుస్తకములో 28నుంచి 32పేజివఱకుఁ గొన్ని యాధారములేనిసంగతులను బ్రచురించితిరి. మఱియు నవి సబార్డినేటుజడ్జీచెప్పినట్లుగా జనులకు నమ్మకముగలుగునటులఁ బ్రచురించితిరికాని యవియన్నియు నిజముకావు.

6 అపీలటుకోర్టుయొక్క తీర్మానములోని 54 వపేరా ననుసరింపకయే యేమియు నాధారములేకుండ శ్రీవిద్యాశంకరదేవదివ్యశ్రీపాద

పద్మారాధక యనుబిరుదు పవిత్రులైన హంపీస్వాములవారికిఁ బీఠాధికారము లేదని తెలుపుచున్నదని ప్రచురించితిరి.

7 మీపుస్తకమునందు 38 వపేజిలో బోధానందభారతీస్వామి యొక్క యధీనమునందుండునది మూలపీఠమని యధికారులు నిర్ణయించినట్లు ప్రచురించితిరి. ఇది యసత్యము. ఈపుస్తకము పవిత్రులైన హంపీస్వాములవారినిగూర్చి కేవల మపవాదకరములైన వాక్యములతోఁ గూడుకొనియున్నది. అది యసత్యము. ఆధారములేనిది. మఱియు నిజమునుగప్పివేసి యబద్ధమును సూచించుచు నపిలటుకోర్టు తీర్మానముల యొక్క యసత్యమైనవృత్తాంతమును వెల్లడించుచున్నది. ప్రపంచమున హంపిస్వామివారియందు శిష్యులకుఁగల భక్తి చెడునట్లుగాను గూరభావముగలిగి నమ్ముటకుఁ గారణమగునట్లుగాను ద్వేషభావముతో నీపుస్తకమును బ్రచురించితిరి. దానియుద్దేశ మీకారణములవల్ల హంపీ విరూపాక్షస్వాములవారిని జనులువిసర్జించి యాధారములేని బోధానందభారతీస్వాములవారి పీఠాధ్యక్షతను స్థిరపఱచుటకై యున్నది. కనుక నీప్రచురణమునుగుఱించి మీపై న్యాయమైనచర్యల నేల జరుపఁగూడదో,యందున యొకవారమురోజులలోఁగాఁ గారణములను దెలియపఱుపఁగలందులకై యీనోటీసు మీ కీయఁబడినది. "

పాకయాజిగారీ హంపీస్వామిదూషణమును బుస్తకరూపమునఁ బ్రచురించుటయే కాక పత్రికలకుఁగూడఁ బంపుటయు నాంధ్రపత్రికాశిక యయ్యది ప్రకటించెను. హంపీవిరూపాక్షపీఠాధ్యక్షుల పక్షపు హైకోర్టుప్లీడరులగు నీ యన్. వెంకటరామయ్యగారు తదాంధ్రపత్రికాశికాధిపతికిఁగూడ నొక నోటీసు పంపిరి. అటుపై నాయన యెంతపరితాపము వెలిపుచ్చుచుఁ బ్రత్యుత్తర మొసంగెనో యీదిగువభాగమునఁ దిలకింపుఁడు.

మదాసు 191 హాంటురోడ్డు, ఆంధ్రపత్రికాశికానిలయము,

28-7-16.

మ|| రా|| రాజశ్రీ యర్. వెంకటరామయ్యగారు
హైకోర్టువకీలు, రాజమహేంద్రవరం.

అయ్యా !

మీయొక్క నోటీసును జడ్జిమెంటుయొక్క కాపీయును నాకు ముట్టినవి. 5-4-16 వ తేదీని మాయొక్క సంచికలోఁ బ్రచురింపఁబడి నటువంటి దేదియో యది యగౌరవమైనదియు బొత్తిగా నిజముకాని దియు నని తెలిసికొనుటకు నేను బశ్చాత్తాపము నొందుచున్నాను. అగౌరవమును దెచ్చునవియు దూరమునసుండు పత్రికాధికారులను మోసపుచ్చునటువంటివియు నసత్యముతోఁ గూడుకొన్నవియు నైన విషయములను బంపు వ్యాసలేఖకు లుందురని నే నెన్నడును సీషన్మాత్రమును దలంపలేదు...ఘనులైన మతాధికారులయొక్క గౌరవమునకు భంగమువచ్చుటకుఁ గారణమైన యుల్లరీతనమునకుఁ జేయవలసినంతి ప్రతిఫలమును నా సహాయ్యకర్తల ను వినియోగించెదనని మీరు ముఖ్యముగా నమ్మవలసినది. ముప్పది యేండ్లకంటె నెక్కువజీవితము గల యాంధ్రపత్రికాశిక తనయొక్క యధికారికిఁ గారణముచూపుమని న్యాయవిషయమైన నోటీసుపంపఁ గాంచుట కిదియే మొదటితడవ.

మీరు దానియొక్క గట్టిఖండనను ముఖ్యముగాఁ బంపఁదలఁచి నట్లయితే నే నట్టిదానిని సంతోషముతో ఘనులైన మతాధికారులకు వచ్చిన గౌరవమునకు వ్యతిరేకముగా సంబంధించు నిందను నివారణ చేయుటకై తగినంత దృఢమైన ప్రతిలేఖను జేర్చుచుఁ బ్రచురించెదను. ప్రత్యుత్తరమును దయచేయుటకుఁ బ్రార్థితులు. ఆంధ్రపత్రికాశిక యిట్టి దురదృష్టమున కింతవఱ కధీనముకాకుండినదని నేను స్పష్టముగాఁ జెప్పెదను.

ద|| ఆంధ్రపత్రికాశికాధికారి.

పాఠకులారా!

కంటెరా యీపత్రికాధిపతి పశ్చాత్తాపము. హైకోర్టువకీలు పంపిన నోటీసును సబ్ కోర్టుజడ్జీమెంటు నకలును జమవుకొని పాకయాజి గారి వ్యాసమును బహిరంగించినందులకుం బరితాపపడియున్నవాఁడు. అది యసత్యమని తెలిసికొనినాఁడు. చెన్నపట్టణ మాయనది. సికింద్రాబాదా యీయనది. అంతదూరపు సమాచారములయందలి వాస్తవ మాయన యేమి యెఱుంగఁగలఁడు? ఇట్టి వ్యాస లేఖకులుందురని యెన్నఁడు ననుకొనలేదఁట. కనుక నే యిటువంటిదూషణవ్యాస మెటులఁ బ్రకటించితివని యడుగఁబడినవాఁడు. పాపము ముప్పదిసంవత్సరముల కంటె నెక్కుడుజీవితముగల తనపత్రిక కిట్టి దురదృష్ట మెన్నఁడును బట్టి యుండదఁట. నేటి కీ పాకయాజిగారిద్వారమున నయ్యది సిద్ధించినందు లకు వగచుచున్నవాఁడు. ఈయల్లరితనమునకుఁ జేయవలసినంత ప్రతి ఫలము తనసామర్థ్యశక్తులఁ జేసెదననుచున్నాఁడు. గట్టిఖండనమును వ్రాసిపంపుమని కోరియున్నవాఁడు. కాని యీవ్రాతలను ఖండించు టకుఁ దలఁపడినవారుకాని మఱి యేచర్యనుగూడ జరుపఁబూనినవారు గాని నాఁ డెవ్వరును లేకపోయిరి. నాఁ డప్పనులు జరిగిన నేఁడు పీఠ సంగ్రహచరిత్ర మరలఁ బ్రచురింపఁబడదు.

శ్రీశ్రీ జగద్గురు హంపీవిరూపాక్షస్వాములవారు జగజ్జేగీయ మానవైభవముతో నాఁడు మహారాష్ట్రదేశమున సంచరించుచుండిరి. కనుక నే వీరివ్రాతలు వారికి సరిగా బోధపడినవి కావు. ఎప్పుడో యొక పరి తిలకించి తత్ప్రతిక్రియ నాలోచింపుఁడని స్వన్యాయవాదులగు యస్. వెంకటరామయ్యగారి కుత్తరువిచ్చిరి. వారు పాకయాజిగారికి నాంధ్రపత్రికాశికాసంపాదకులకు నోటీసులుచేసిరి. ఆంధ్రపత్రికాశికా సంపాదకులు క్షమాపణకోరిరి. పాకయాజిగారు కోరలేదుకాని కోర కున్నను విరూపాక్షస్వాములవారుండునది మహారాష్ట్రదేశము; న్యాయ

పాడులుండునది రాజమహేంద్రవరము; పాకయాజిగా రుండునది సికింద్రాబాదా యైనకారణమున నొకటి కొకటికి సంబంధింపక తగుశ్రద్ధ యేమియుఁ దీసికొనఁబడినది కాదు. తద్విరూపాక్షపీఠ శిష్యులైనను శ్రద్ధతీసికొనుట కది నిజాము రాష్ట్రము, తత్రత్యులు తమ మనోవాక్కాయముల చేతను గురుపరిచర్య జరుపుటకు వెనుదీయ రుకాని యిట్టిపట్టుదలలు తక్కువ. వారి కిట్టి చాకచక్యము లేదని చెప్పి నను జెప్పవచ్చును. సికిందాబాదుపురమునఁ గొందఱున్నను వారి కయ్యది తాత్కాలిక వాసభూమియే కాని స్థిరముకాదు. అప్పటికిని శృంగ గిరివిరూపాక్షపీఠమే యిపుడు పొగాకుబజారునందలి ధర్మసత్రమున వేంచేసియున్నదనియు నిదియే యాదిపీఠమని ప్రభుత్వమువారు తీర్మా నించియున్నారనియు నింతటినుండి యీపీఠమునే యారాధించి యిహ పరలోకసౌఖ్యము లనుభవించుఁడనియుఁ బాకయాజిప్రభృతు లెంత ప్రబోధించినను జనసామాన్యము సుముపరిక్క(దొ)రిక్కనిచ్చినవారుకారు.

ఈయీ కారణములచే నాఁటి పీఠసంగ్రహచరిత్రాత్మక విరూ పాక్షపీఠాధ్యక్షదూషణము పాకయాజిగారికిఁ బ్రతిఫలం బొసంగినది కాదు. కనుకనే మగల నియ్యోడఁ దలయెత్తినది. నాఁడు బోధానందభా రతి నుద్ధరించుటకుఁగా విరూపాక్షపీఠమును దూషించుచు బయలు వెడలినది. నేఁడు కల్యాణానందభారతి నుద్ధరించుటకుఁ బుష్పగిరి పీఠ మును దిట్టుచుఁ బొడసూపినది. చూపినఁ జూపుఁగాక! ఇది బ్రిటిషురా జ్యము. ఆగమిష్యమాణ స్వరాజ్యమును. అత్రత్యులు నాగరికులు. విమ ర్శకులు. సత్యనిర్ధారకులు. కావున నేదియో యొకటి ప్రకటితముకా నంతతో వదలిపెట్టరు. 'సత్యమేవ జయతే నానృతం' మ్మని ముఖపత్రమున నున్నంతన సత్యమని భ్రమింపరు. మితిమీరి దూషించిన న్యాయస్థాన ముల కెక్కింపక యూరకుండరు. దీనికంతటికిని బాకయాజిగారి ద్వితీయ పర్యాయపుఁ బీఠసంగ్రహచరిత్రయుఁ గల్యాణానందభారతీస్వాముల

వారి ప్రథమద్వితీయ శ్రీముఖములును బ్రకటీకృతములైననాఁటినుం డియు నేతద్దేశీయులు తుదిసెడి పత్రికావృష్టియుఁ జేయుప్రయత్నములే ప్రబలసాక్ష్యములు. ఈసంగతు లిట్లుండనిండు. ఇఁక వీరి పీఠసంగ్రహ చరిత్రను బరిశీలింతము. అందుఁ బ్రప్రథమమునఁ బ్రకటితము వాంఛీ విరూపాక్షపీఠనిందాత్మకము. అందలియంశములే ముందు చర్చింతము.

(సశేషము)

## వైకంసత్యాగ్రహము.



### ప్రాచీనాచారపరుల యభిప్రాయము.

దేవతాప్రతిష్ఠాపనలుగలిగి శిష్టాగ్రేసరులు నివసించుప్రదేశముల బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులగు చతుర్వర్ణములవారు తమతమ మత ధర్మములననుసరించి దేవతాప్రార్థనాదులు చేసికొనుచుండిరి. ఈప్రదేశ ములయందు చాతుర్వర్ణ్యమునకుఁగాక తక్కిన పంచమాదులకుఁ బ్రవే శింప నర్హత లేదు. పూర్వకాలమునఁ బూర్వాచారపరాయణులు తమ మతములవారి కాస్తిక్యమును బెంపొందింప నీదేవతాప్రతిష్ఠాపనల వారి స్వీయధనముచే స్వకీయస్థలములలో నెలకొల్పియుండిరి. అదిమొ దలుకొని యింతవరకును నాప్రతిష్ఠాపకుల యభిప్రాయప్రకారము నాల్గువర్ణములవారుగాక యితరులెవరు నాస్థలములఁ బ్రవేశించియుండ లేదు. పంచమాదులకు నీయాస్థలములం బ్రవేశింపకుంటచేఁ గల్గు వ్యా వహారికకష్టము లేమియు లేవు. ఆయాపురములఁగల పురవీధులలో రాజమార్గములలోఁ బ్రవేశించుటకుఁ బంచమాదుల కేమియు నిషేధ ములు లేవుగాన వార లచ్చటఁ బ్రవేశింపవచ్చును. సర్వవ్యవహార ముల నడుపుకొనవచ్చును. ఇంతవరకు నీదేవతాసంస్థలుగల ప్రదే శములలోఁ బంచములు ప్రవేశింపకోరుటయు లేదు మతధర్మము లలో దేవతారాధనాదులయందు నొకమతమువారి నిం

కొకమతమువారు బాధింపక సహనభావముసూపుట అనాదినుండియుఁ గలదు. ఈ విధముగ నవ్యాహతమగు నాచార మబాధితముగఁ బ్రవర్తించుచుండ నేటికాలమునకు మతధర్మములందు మతప్రవర్తకులయందుఁ దత్ప్రమాణశాస్త్రములయందు శ్రద్ధాభిమానములు లేని యిక్కాలపు నవనాగరికులు పంచమాదులం బ్రేరేపించి దేవతాప్రతిష్ఠాపనలుగల యాస్థానములందుఁ బ్రవేశింపఁ జేయఁజూచట యనాలోచితకార్యముగఁ గన్పట్టుచున్నది. ఇందువలన నిష్కారణకలహమును హైందవులలోఁ బంచములకును దక్కిన నాల్గువర్ణములవారికిని గల్పించినవారలగుచున్నారు. పంచముల జ్ఞానముచే నైశ్వర్యముచేఁ బెంపొందించి అజ్ఞానదారిద్ర్యములం బారఁద్రోలి జ్ఞానులనుధనికులను జేయవలయుననుటలోఁ బ్రాచీనాచారపరాయణులు విరోధభావము నేనాఁటికిఁ బూనినవారు కారు. దయాదాక్షిణ్యాదిగుణములు నవనాగరికుల కున్నంత ప్రాచీనాచారపరాయణులకు లేకపోలేదు. కాని స్వమతమును మతప్రవర్తకులగు మహర్షుల యాదేశమును శ్రుతిసాంప్రదాయమును విడనాడి తా మధఃపతితులై యితరులనుద్ధరింపఁజూచుటలో మాత్రము వెనుదీయుచున్నారు. ఐహికము కలదని భ్రమించి యాముష్మికమును విసర్జింపఁజూచుటను గర్హించుచున్నారు. భారతవర్షములోనున్న యిన్ని మతములవారు ఇన్ని వర్ణములవారలు భిన్నభిన్నమతాచారధర్మములుగలవారలందఱు నైకమత్యముగలిగి యేకమార్గమున వర్తింపవలసివచ్చినప్పు డది పరస్పరమతసహనముగలిగి వారివారి మతాచారధర్మముల నింకొకరు బాధింపక తమమతధర్మములఁ దాము రక్షించుకొనుచున్నటుల నితరుల మతధర్మములఁగూడఁ దాము ప్రీతిపూర్వకముగ రక్షింపఁజూచుటచేతనే గలుగును. అన్యథా తటస్థింపదు. మహమ్మదీయులపండుగులలో హైందవులమగు మనము మహోత్సవముల మానుకొనుట లేదా? వారిమసీదులముందు మేళతాళముల నాపుట లేదా? సీతాదేవి రావణు

నకు శ్లో॥ యథాతవ తథాన్యేషాం దారా రక్ష్యా నిశాచర!॥ రావణ! నీవు నీభార్యను రక్షించుకొనినట్లు అందఱు వారివారి భార్యల రక్షించుకొన వలయును అని బోధించెను. ఇందుఁగన్పించుచున్న నీతిని దెలిసికొనుఁడి ఎవరి మతమును వారు రక్షించుకొని మతాచారములననుష్ఠించి యిహపరముల రక్షించుకొననిండు మీకుశ్రద్ధలేకపోయినను శ్రద్ధాళువుల బాధింప కుఁడు శ్రుతిస్మృతిసూత్రములఁ దద్విహితధర్మములఁ బ్రమాణముగఁగొని యితరులనేమాత్రము బాధింపక నిర్బాధకమగు మార్గమున నాముష్మికఫలమును గోరి నిష్కామకర్మనాచరించు ధర్మపరుల వెంటాడి తరుమచూచుట పాడిగాదు. మీరలు మీమతధర్మముల విడనాడితిరి. మీమతమందుఁ బ్రమాణగ్రంథములయందుఁ బ్రామాణ్యమును బోనాడితిరి. పోనిండు. వానియందుఁ బ్రామాణ్యజ్ఞానముగలవారిని దరుమచూచుట యేమిధర్మము? కాన నిట్టిబలవద్విరోధముగలకుటుంబ కలహమును దెచ్చిపెట్టుకొనుట మహోపద్రవకరమగును గాన ధర్మనాశకులు కావలదని తెలుపుచు నింతటితో విరమించుచున్నాఁడ.

రక్తాక్షి సం॥ ఇట్లు,

వైశాఖ శు ౫ లు వేమూరి శివస్వామిశాస్త్రి.

ఈ వైకమనునది తిరువాన్కూరు (అనంతశయనము) సంస్థానమునకుఁ జేరిన యొకయగ్రహారగ్రామము. ఇప్పుడిపుడు గ్రామమభివృద్ధిని జెంది దుకాణములు కచేరీలు మున్నగునవి యేర్పడుటచే నదియు నొక్క పురమునాఁ బడుచు జనసందష్టముకలిగియుండుచున్నది. అయినను నగ్రహారభాగమున నొక్కబ్రాహ్మణులగృహములేయుండుటయు నావీథులు ముఖ్యులగు చతుర్వర్ణజనుల రాకపోకలకుమాత్రమే యనువగుచు దేవస్థానములతోడను ధర్మసత్రములతోడను వేదశాస్త్రపాఠశాలలతోడను గూడుకొని యుండెనవి. అందువలన నావీథులకుఁ బంచముల రానీయరు. పంచ

ములేకాదు పెక్కొన్ని నిమ్నజాతులును దద్వీధులకుం జనుమర్యాద లేదు. పంచమేతర స్పృష్టజాతు లొకవేళ కార్యావసరమునఁబట్టి రావలసివచ్చినను దమవర్ణముపేరు చెప్పుకొనుచు దూరమందే నైచ్యము వలంబించి యుండవలయును. ఈయాచార మా మళయాళదేశమందంతట నుండినదేకాని యొక్క యాగ్రామమున మాత్రమే కాదు. ఇట్టిచో నిప్పటి యస్పృశ్యతామహాపాపనివారకసంఘము వారు కొందఱక్కడికిఁగూడ దయచేసి యా దేవతాసదనవేదపాఠశాలాదులతోఁ గూడియున్న బ్రాహ్మణవీథులకుఁ బంచములఁ దీసికొనిపోవుటయుఁ దత్రత్యులు దానియుకుండుటయు వీరు సత్యాగ్రహముచూపుటయు వారు ప్రభుత్వమువారితోఁ జెప్పుకొనుటయుఁ దటస్థించెను. అనంతశయనము మైసూరు కొచ్చి సంస్థానికులు దేవబ్రాహ్మణులయందు భక్తివిశ్వాసములుగలవారు. అందువలనఁ దద్బ్రాహ్మణవీథులకు జండాలురు చనఁగూడదని శాసించిరి. స్వరాజ్యకాములు సత్యాగ్రహశీలురై శాసనాతిక్రమణ మొనరించిరి. ప్రభుత్వమువారు పట్టి బద్ధులఁజేసి కారాగృహములకుంబంపిరి. అంత మనవార లొకరివెనుక నొకరువెళ్ళి క్రమముగాఁ బెక్కండ్రు కృష్ణజన్మస్థానముల నలంకరింపఁజొచ్చిరి. అంత నాయనంతశయనసంస్థానికులు వీరిని జైళ్ళకుఁ బంపక దేవతాయతనవిరాజితములగు నాబ్రాహ్మణవీథులకుఁ జండాలురు రాకుండ భటులఁ గాఁపుపెట్టిరి. సత్యాగ్రహమనఁగా దౌర్జన్యరహితముగాఁ బట్టినపట్టు నెగ్గించుటకనుక రాజభటుల నవలకునెట్టి యావీథులఁ బ్రవేశింప వీలుగామిని బంచములును దత్ప్రేరకులును దద్రాజభటుల కెదురుగా గుంపులుగుంపులు కూర్చుండి యుండుచున్నవారు. సనాతనమతవిరుద్ధమని యీవిషయమునఁ దిరువాన్కూరుప్రభువు విరుద్ధుఁడయియే యున్నవాఁడు. ఆయనను దమవైపునకుఁ ద్రిప్పుకొనుటకుఁగా దేశనాయకులు కొందఱు ప్రయాణమగుచున్నవారు. ఆంధ్రాదిపత్రిక లంట

రానివారినందఱి నాహ్వానించుచున్నవి. సకలదేశముల చండాలురును జని సత్యాగ్రహ మొనరింపవలెనఁట. వైకంసత్యాగ్రహ మనఁగా నియ్యది. ఈవిషయమైఁ పూర్వాచారపరాయణుల యభిప్రాయము వేమూరి శివస్వామిశాస్త్రిగారిద్వారమునఁ బైనఁ దెలుపఁబడియే యున్నది.

## మహాత్ముని హెచ్చరిక.

( ఎంగ్ ఇండియా )

వైకంసత్యాగ్రహము నియమములను దాటిపోవుచున్నదేమో యని నాకు భయమగుచున్నది ... హిందూసంస్కారమునకు సంబంధించిన విషయములలో నితరులు జోక్యముగలుగఁజేసికొనునెడల పూర్వాచారపరాయణులగు హిందువు లట్టిదాని నేవగింతురు... వైకంలో ఉద్యమమును నడుపుచున్న హిందూసంస్కర్తలు పూర్వాచారపరాయణులగు హిందూసోదరులను నిర్బంధపెట్టి తమమతమునకుఁ ద్రిప్పుకొనరని నేను నమ్మెదను. పూర్వాచారపరాయణులను భీతిపెట్టవద్దు. సంస్కర్తలు పూర్వాచారపరాయణులను భయపెట్టవలదని నేను గోరుచున్నాను వైకంలో యాతగాఁబుదావచ్చిన రోడ్డువిషయము పరిష్కారమగునెడల మలబా రంతటిలోను అస్పృశ్యతాసమస్య పరిష్కారమగునను నభిప్రాయములో నే నేకీభవింపఁజాలను... గుజరాతులో ఒకబావిలో అస్పృశ్యులు నీళ్లుతోడుకొనుట కాటంకము తొలగింపఁబడెనని గుజరాతులో అన్నిబావులును వారి యుపయోగమునకు వదలివేయఁబడునని తలంపరాదు... పూర్వాచారపరాయణులగు వారిని భయపెట్టి లోఁగదీయునెడల హిందూమతమేమగునో ఆలోచింపుఁడు. అది సత్యాగ్రహమగునా?... అయ్యది హిందూసంస్కారమగునా?

## భక్తసమావేశము.

ఈ భక్తసమావేశము కొల్లూరు నుల్లిప్రూడి యనంతవరము మున్నగుగ్రామములలోని బ్రాహ్మణులు పెక్కండ్రు మూఁడుమాసముల కొకసారి యొకచోటఁ గూడి భక్తిజ్ఞానవైరాగ్యములనుగూర్చిచర్చించుకొని భగవద్భజన పురాణప్రవచ నోపన్యాసాదులతోఁ బ్రొద్దుపుచ్చుచుఁ గూడినవారందఱుగాని తగు నుపపత్తి గలిగియున్నచోఁ దత్తద్గ్రామస్థు లందఱు గాని కలసి భుజించుటయని సంగ్రహముగా రుధిరోద్గారి కార్తికమాసపత్రికయందుఁ దెలిపియుంటిమి. అట్టిసమావేశము ప్రప్రథమము రుధిరోద్గారి సం॥ ఆశ్వయుజమాసమం దనంతవరమున జరుపఁబడి యుండు రెండవసమావేశము వల్లభాపురమున జరుపవలసినట్లుగాఁ దత్సభికులచే నిశ్చయింపఁబడినది. కాని యింతలో నర్సారావుపేట భక్తసంఘమువారత్యంత మాహ్వానముచేసియుండుటచే నందే జరిగియుండెను. నర్సారావుపేట వంశపరంపరాగతుల కేకాక వచ్చుచుం బోవుచుండెడి రాజకీయోద్యోగులకుఁగూడఁ దఱచు వాసభూమియై యలరారుచుండెడి. ఇదియునుంగాక తన పుత్రకళత్రము లొకసంవత్సరముననే పరలోకగతులగుటచే గుంటూరుతాలూకా యనమదల గ్రామవాస్తవ్యుఁడగు రాచకొండ కొండయ్యగారను భగవద్భక్తవర్యుఁడు తనకున్న యాస్తియంతయు నర్సారాయపురనివాసియుఁ దన తోఁబుట్టువు నైన రాచకొండ పెద వెంకటప్పయ్యగారి యింటికిఁజేర్చి తద్గృహంబుననే సంతతాచరితభగవద్భజనుండై యుండుచుండెను. ఈయనకును రాజకీయోద్యోగులలో నొకరగు ట్రైనింగుస్కూలు హెడ్మాస్టరు జటిప్రోలు సర్వభద్రముగారికిని భగవద్గుణానువర్ణనముపట్లఁ బ్రత్యహమును సమావేశంబగుచుండుటయు నొకనాఁ డిరువురిహృదయంబులను భక్తసంఘము నాహ్వానించుటకుఁ దలఁపుగలిగెను. తత్ప్రయత్న మాచరించిరి. అందులకు వాల్కాటుకంపెని సబ్ఏజంటగు కొడవటికంటి వెంకటప్పయ్య

గారును కార్టర్ ప్రెస్సు గుమాస్తాయగు రంగావఝ్ఝల రంగయ్యగారును మేళ్ళచెరువు కామయ్యగారును దోఁపుగా స్వహస్త పరహస్తములనుండి సహస్రాధిక రూప్యంబు లొకచోఁ గూర్చిరి. రాచకొండ కొండయ్యగారు, సహస్రబ్రాహ్మణభోజనము సప్తాహము బ్రహ్మసత్రము సామ్రాజ్యపట్టాభిషేకము ననునాలుగు మహాకార్యములు చేయుటయే కాక యేఁటేట ననేకభగవదుత్సవములొనర్చు మహాభక్తుండును నన్నదాతయు నై యత్యంతము యశమార్జించినవారు. సప్తాహబ్రహ్మసత్రాది సత్కార్యము లెక్కుడ జరిగినను దద్యజమానులీయనను దోడ్కొనిపోయి కార్యమున కేలోపము లేకుండ నడిపించుటకుఁ బెత్తనము పైన వేయుచుందురు. ప్రత్యహమును బ్రాతస్సాయంసమయంబులఁ దంబుర చేత మీటుచుఁ బరవశుండై భగవద్భజనము చేయుచుండును. మానవసహజములగు నహంకార మమకారాదులు పూర్తిగా వీడకున్నను భగవద్విషయకమగు పాటగాని పద్యముగాని ప్రశంసగాని వినంబడినపుడు పులకాంచితదేహుఁడై యానందబాష్పములు బొటబొటఁ గార్చుచుండును. అవ్యాజమైన భక్తియన్న నదియేకదా!

అట్టివాఁడగుటచేతనే యన్నిచోట్లజరిగెడి సమావేశములవలెఁ గాక నర్సారావుపేటలోనైన భక్తసమావేశ మత్యంతస్తోత్రపాత్రంబయ్యె. నర్సారావుపేటభక్తసంఘముపేర నాహ్వానపత్రికలు పంపుటకు మారుగా నందఱు నియ్యకొని కొండయ్యగారిపేరనే పంపిరి. అనేకకార్యముల కనేకుల నాహ్వానించి యాచరితాఖిలవివిధసదుపచారుండై యశముగొన్నవాఁడగుట నాయనపేరుతో నాహ్వానపత్రికలు పోవుటతోడనే యఖిలదిశలనుండి వందలు వేలు జనులు చనుదెంచిరి. భక్తసమాజములో మెంబరులుగాఁ జేరినవారే కాక స్వాధ్యాయపరులు శాస్త్రజ్ఞులు కర్మిష్ఠులు పౌరాణికులు హరికథకు లుపన్యాసకులు

గాయకులు మొదలగువారు పెక్కండ్రు చనుదెంచి నేలయీనినట్లు నగ్రహారాపుపేట నలంకరించుటయు శంకరమంచి లక్ష్మీనారాయణశాస్త్రి నిర్మింపించిన శంకరమఠముచుట్టును విస్తృతమగు పందిళ్లు వేయించి యాగతులకు విడుదులుకల్పించి యైదుదినములు నవనీశునింటి పెండ్లి విధంబున నతివైభవముగా నందఱను సర్వోపచారంబుల నానందింపఁ జేసిరి. సర్వభద్రపుఁగారును గోడవటికంటి వెంకటప్పయ్యగారును రంగావఝ్ఝల రంగయ్యగారును మేళ్లచెర్వు కామయ్యగారును వీరు వారు నననేల పోరు తెల్లరును నడుములుకట్టుకొని నిల్చి పనిఁజేసిరి.

అహరహమును వెయిరెండువేల బ్రాహ్మణులకు రెండుపూటలును నన్నదానము చేయఁబడియెను. తత్సమావేశమునకు ములుకుట్ల లక్ష్మీనారాయణశాస్త్రిగారు కార్యదర్శులై నియమముల నతిక్రమింపకుండ హరిభజనము పురాణము హరికథ యుపన్యాసము మొదలగు వానిని దేనితర్వాత నేదిజరుగవలెనో యదియట్లు జరిపించిరి కొందఱు కృష్ణలీలలు ప్రదర్శించిరి. కొందఱు కృష్ణలీలాతరంగములు పాడిరి. కొంద ఱాడిరి. ఇట్లన్నివిధముల భగవంతుఁడు ప్రత్యక్షమైనవిధంబున నచట సమావేశమైన యందఱును భగవద్భక్తిపరిపూరితులై పరమానందమున నోలలాడిరి. ఈసమావేశమున నొక నియమము పెట్టుకొనిరి ఆహ్వానసంఘమువా రాగతులైన యందఱ యన్నపానా ద్యర్హార్చనమునకే బాధ్యులుగాని యన్యసన్మానములకు బాధ్యులుగారు. ఆయాశ మెవ్వరును పెట్టుకొనఁగూడదు. యానాయానవ్యయంబులుసహిత మెవ్వరివి వారే భరింపవలె. ఇదిమంచిపద్ధతియే. లేకున్న నిది యెవరియింటి పెండ్లి? వచ్చినవారికి మెచ్చునట్లుగా రెండువేళల నన్నముపెట్టుటయే పదివేలు. ఇయ్యది యొకరిద్దఱికిమాత్రమే యనభిమతమయ్యెఁ గాని యందఱికిని నభిమతమే దాసికేమి అందఱిని మెప్పించు టలవిగానిపని. అం దరుదెంచినవారిలో నగ్రేసరులు మల్లాది రామకృష్ణ విద్వచ్ఛాయ

నులవారు. వీరి లీసమావేశములోని యన్నియంశములకును నంగీకరించిరికాని యొకటిరెండిటిలో భేదించిరి. అందు మేమును నేకీభవించుచున్నారము. అవెవ్వియన, భక్తిజ్ఞానవైరాగ్యములు మూఁడును జర్చింపఁబడుటయే సభోద్దేశము కాని భక్తివైరాగ్యోద్బోధకములగు కొన్నిపనులు జరుగుచున్నను జ్ఞానమునుగూర్చినవి యించుక తక్కువైయున్నవి. ఈ జ్ఞానకాండమే ప్రథమభాగము కర్మముతోడను ద్వితీయభాగము జ్ఞానముతోడను నిమిడియున్నది ఆకర్మజ్ఞానములు రెండు నావశ్యకములే. తాళమృదంగాదివాద్యరవంబున మున్నలై నియతకాలంబులఁ గర్మమాచరింప నుపేక్షసేయఁగూడదు. భక్తివిషయమైయే కాక కర్మజ్ఞానముల విషయమైకూడ నుపన్యాసములు జరుగవలె. తదాచరణమందును సక్తులై యుండవలె. భక్తసంఘము వారీయంశమును మార్చుకొందురుగాక!

రాచకొండ కొండయ్యగారిట్లు మఱియొక బ్రహ్మసత్రముంబోలె భక్తసమావేశమును జేయించి యనమదలకుంబోలె నర్సారావుపేటకు నపూర్వయశస్సు నార్జించిరి. ఇదియునుంగాక శివరాత్రికిఁ గోటప్పకొండకేగు యాత్రికులకుఁగూడ మూఁడుదినములు మధురభక్ష్యసహితముగా నన్నదానమాచరించి యత్యంతసౌకర్య మొదఁగూర్చిరి కొండయ్యగారి కిట్టి సదుద్దేశ మున్నను నొక్కఁడే నిర్వహింపఁజాలఁడు. పూర్వోక్తులగు కొడవటికంటి వెంకటప్పయ్య రంగావఝ్ఝల రంగయ్య మేళ్లచెరువు కామయ్య మున్నగు పౌరుల తోడ్పాటుతోడనే యిట్టి పనులు నెరవేర్చుచున్నవాఁడు. అట్లు రెండవభక్తసమావేశము నర్సారావుపేటలో నైనపిదప మూఁడవసమావేశము వల్లభాపురముననను నాలవసమావేశము రేపల్లెతాలూకా నల్లూరునను జరిగియుండెను. నల్లూరునఁగూడ నూతనయజ్ఞోపవీతధరులైన కమ్మమహాజనులు కొందఱున్నవారఁట వారందఱు నీసమావేశమైన భక్తులవద్దకువచ్చి జన్నిదంబులుధరించిన మేమేల బ్రాహ్మణులము కాఁగూడదని ప్రశ్నించిరఁట!

అయ్యాది మీగ్రామప్రముఖులనే యనుగుంజపొందని వా రుత్తరమిచ్చి రఁట. అంత నటనుండి యోగి వారలు భక్తులు సమావేశమైన పాకాకు నిష్పంటించిరఁట. అది దైవకృపచే వెంటనే తెలిసికొని యార్పి వేయఁ బడెనఁట. కావున భక్తిజ్ఞాన వైరాగ్యముల ద్వారమున ముక్తి నపేక్షించు సత్పురుషు లాభక్తసమావేశమున నుంబరులుగాఁజేరి కృతార్థు లగుదురుగాత!

హరిపంచవింశతి.

శ్రుతివలన యాజ్ఞికేతరమగు హింస చేయఁగూడదని తెలియు నయ్యెడిని. ఇట్టిచో నొక ఘోర హింస యొక యూరిలోఁ గావింపఁబడి వినువారికిఁగూడ విషాదము కలుగఁ జేయుచున్నయది. కొన్నిచోట్లఁ గోఁతులు గుంపులుగుంపులుగా నుండి ఫలవృక్షములను బంటపైరులను బాధచేయుచుండును. వేయేల? తీర్థక్షేత్రములలో యాత్రికుల యన్నవస్త్రాదులసహిత మాకస్మికముగా నెత్తుకొనిపోవుచు నబలలను నర్భకులను బైనఁబడి కఱచుచుఁ గూడ నుండును. అయ్యది యాజాతి స్వభావము. ద్విపాత్తులగు మనుజులే విధినిషేధములు లేక ప్రవర్తించుచు దుర్మార్గులై యొరుల ప్రాణమాన ధనంబుల హరించుచు ననేకవిధంబులఁ జెఱుపుచేయుచుండఁ జతుష్పాత్తులు నందును మర్కటములు నగు నల్పసత్వముల యవివేకమున కాశ్చర్యపడు టనవసరము. నిజాంరాష్ట్రమునకుఁ జేరిన నల్లగొండజిల్లా జానగాముతాలూకా యయినాపురగ్రామమున నీకోఁతులుపంటపైరుల మంటఁగలుపుచుంటయు నొకతుంటరి వాని నన్నింటిని వింటబాణము సంధింపించి జమునింటి కనిచెనఁట. అయ్యాకృత్య మచ్చటిసజ్జనులకపరిమిత మైన యలమట గలిగించుటయు నందు రాయచూరి బండేరావను నొక రసికయువకుని ప్రేరణమున గౌరిభట్ల రఘురామశాస్త్రియను నొక

బాలకవి విషాదసూచకంబులగు కొన్ని పద్దియంబులు వ్రాసి మా వద్ద కనిచెను, అవి నీతిబోధకములై హింసనునిరసించుచున్నందున నిటం బ్రచురించుచున్న వారము.

కం॥ హారికులసంజనితుండవై
హరినాయకు నేలి కోల హరిసుతు నసువుల్
హరియించురీతి నిపు డీ
హరిహంతకుం (బ్రాణములను) హరియింపు హరీ! ౧

కం॥ శిష్టత్వము విడి ప్రాణికిం
గష్టములొడఁగూర్పఁ జేయు కలుషాత్ముల నా
దుష్టుల నణఁచుట నీకిల
స్పష్టపువ్రత(మగును)గాన సల్పు మిది హరీ! ౨

కం॥ ఎప్పుడుఁ దుచ్ఛపుఁబనుల్
జప్పుడుగాకుండ మిత్రుల సల్పుదు రకటా
ముప్పు ఘటిల్లును మీకని
చెప్పఁగ (దుర్మార్గు లింత) చెవినిడరు హరీ! ౩

కం॥ రూపికలనిచ్చి రోయక
పాప మ్మొడిగట్టి కష్టపడి కోఁతుల హా
రూపును మాపించెదు నీ
యాపురుషుని నైజగుణమొ యదియేమొ హరీ! ౪

కం॥ చంపిన దోసముగానీ
చంపించిన రా దఘంబు తమయని వక్కా
ణింపఁగఁ దొడఁగె నాతఁడు
చంపినఁ జంపించిమాడ సరిగాదె హరీ! ౫

కం॥ కట్టా! యిట్టులఁ జేయఁగ
నెట్టులఁ దలపెట్టెనో కొ్క,యిట్టులన నేలా,

చెట్టుతలంపుల వారలు
పట్టుగఁ దల లట్టె కొట్టఁ బాల్పడరె హరీ ! ౬

కం॥ ఎంతగఁజెప్పిన నేమగు
నింతయుపిన దక్షకోటి యిదియుండు జనుల్,
కొంతపరిజయేని విని మతి
మంతంబై యిట్లు సేయ మానదొకొ హరీ ౭

కం॥ తక్కటివాఁ డిదియెఱుఁగరు
నిక్కమ్మని యెంచి నేము నీచాత్ముఁడు పా
గ్రిక్కనఁ ద్రావెడు పిల్లిమ
యొక్కరు గనరనుచు నెంచుసామెతగ హరీ ! ౮

కం॥ ఒక్కడ రెండా లెక్కకు
నెక్కువయైనాఁ దగుచరాళి యియ్యెడఁ గనఁగా
నక్కట ! యొకకూనయుఁదా
నిక్కడఁ గానంగరాదికేమందు హరీ ! ౯

కం॥ ఇచ్చెడిరొక్కములిచ్చిన
నిచ్చమెయింబోవు ననుచు నిటఁదెల్పెను నీ,
వృచ్చింజేతలు సేసిన
రచ్చల కెక్కక యెటుండు రసలోన హరీ ! ౧౦

కం॥ ఎందఱు లేరీపురమున
నందటివలెనూరకుండ కాకీశములన్
మరిందింపఁజేసి యఘముం
బొందెను, నిదికూడు నెటులఁ? బోకార్చు హరీ ౧౧

కం॥ ననుఁబోలువాఁ డెవండును
గనఁగను లేఁడనుచు పీడు గర్వపువాక్కుల్

పసివడఁ బల్కుచునుండెడు
(వినఁజాలకయుంటిమయ్య వీనినిన్న) హరీ! ౧౩

క॥ ఎప్పుడునాతోఁ జె(ప్పెడు రొప్పని) కార్యములువీ(రలో హరీ యనుచు
నెప్పుడునుండెడునీతం(డిప్పుడు తగదిద్దియనుచు నె(ఱుఁగండే) హరీ!

క॥ ఆరూపు రామణీయము నారేఖ విలాసములును నాదూఁకులునుఙ్
గారాముతోఁ దఁగ్గనైన కీరితం జదుపఁ జేతు లెట్లాడె హరీ! ౧౪

క॥ పురమున నేఁ గనరామిని
(బరుషాత్మకుఁడైనవీఁడు పట్టి వధించెఙ్)
హరికుల (మంతయు) నుండిన
జరుగునె కపినాశ మి (టులఁ గంజాక్ష) హరీ! ౧౫

క॥ ఒరులెవరు చంపఁగల్గిన
(సరగున)నూరూరఁ జాటఁ జనియెడి తనకుఙ్
(గరము)ప్రియ మ్మగుటనుగా
(గుటివెట్టి హరింపఁజేసెఁ గోఁతులను) హరీ! ౧౬

క॥ ఎన్నఁడు నిట్టి కుచేష్టలు గ్రిన్ననఁదల పెట్టి చేయఁగడఁగని వీఁడుఙ్
జిన్నతనమ్మునఁ జేసెను విన్నజనుల్బ్రీవ్వఁదిట్ట వినిమనుచు హరీ! ౧౭

క॥ చీవాటు లెన్ని పెట్టినఁ జేవాటుతనంబులెల్లఁ జెడుగుల కకటా
పోవంగఁజూడఁగల్గుట కేహ(రికినబ్బునటవె యె)పుడేని హరీ! ౧౮

క॥ ఎగ్గనితలఁపక మదిలో
సిగ్గొకయింతేనిలేక సిరిదొలఁగఁగ సీ
బెగ్గలిక నుడిగిచేసిన
లొగ్గిడిపని కిపుడు మిత్తిలోఁ జొరఁడె హరీ! ౧౯

క॥ ఎల్లరుఁ దను జీచీయను
పల్లదముం జేసి మిపులఁ బాటులనొందఙ్

జెల్లునె, యెవరే(నియువిన)
నల్లనఁగాండ్రించియునుతురని కననఁడు హరీ! ౨౦

కం॥ ఎల్లెడలఁ జెట్టచేఁతల నొల్లరు చేయంగ విబుధు లోటమి లేకే
కొల్లలుగఁ జేయఁ(జూచెద ర)ల్లనదుర్జనులు జీవహత్యలను హరీ! ౨౧

కం॥ (ఎట్టోవచ్చెను నిచటకి) గుట్టలగట్టులను జెట్లఁ గుర్రిమ్మరు కపుల్
నట్టడవిఁబట్టఁ దోలక కట్టా! కొట్టించెఁ జావఁ గఠినత నృహరీ! ౨౨

కం॥ జీవితము దాఁకఁ గీర్తిని జీవించుటలేక జనులు నీయుస భువిపై
జీవించుకంటె నెట్టులొ చావఁగఁ జూడంపు వీఁడు నరగునను హరీ! ౨౩

కం॥ చెడుపనులు చేయరాదని
చెడుగుల కెన్నన్నియేని చెవిఁజెప్పిన నా
చెడుపనులు చేయకుండుచుఁ
జెడుగం డసపించుకొనక చెలఁగుదురె హరీ! ౨౪

కం॥ (భీతిగఁ(గోఁతులఁజదివెడి పాఠకులకు బుద్ధిగల్గఁ బద్దెంబుఁ నే
నీతఱిఁ జేసి(తి పనిని విఖ్యాతంబొనరింపవమ్మ తొమ్మస్థలిని(హరీ! ౨౫

☞ ఈపైపద్యములలోని కుండలీకరణములకు మధ్యభాగము సంస్కరింపఁబడినదని యెఱుంగునది.

## ప్రాజ్ఞలోకము మిన్నకుండుట ధర్మమా?

కర్మభూమియైన భారతవర్షము నేఁడు కర్మబాహ్యమై యథోగతి నొందుచున్నది. ప్రతివ్యక్తియు తన నిర్ణీతసంధానమును నెరవేర్చుట లేదు. నాసికాపుటమం దుండవలసిన ముక్కెర పృష్ఠభాగమం దలంకరింపబడుచున్నది. పిడుగునకును బియ్యమునకును ఒకే మంత్రోచ్చారణ జరుగుచున్నది. బ్రాహ్మణులలో ఒకశాఖవారు మరొకశాఖవారిని ద్వేషించుచున్నారు. నియోగులు తమ అంతశ్శాఖలవారిని ద్వేషించుచున్నారు. వైదికులు తమ అంతశ్శాఖలైన ములకినాడు వెలనాడు కా

సలనాడు తెలగాణ్యము మొదలగువారిని ద్వేషబుద్ధితో జూచుచున్నారు. మరల మొత్తముమీద నియోగులను వైదికులు వైదికులను నియోగులు ఏహ్యాభావముతో జూచుచున్నారు. శివార్చకులకంటె పూజార్లు యెక్కువనియు వీరికంటె తంబలు యెక్కువనియు వీరికంటె నంబు లెక్కువనియు వీరికన్న వైష్ణవు లెక్కువనియు వీరికంటె వైఖానసు లెక్కుడనియు వీరికంటె పాంచరాత్రమువా రెక్కువనియు వీరికంటె ప్రథమశాఖవా రెక్కువనియు వీరికంటె బుఋంబు లెక్కువనియు వీరికంటె నందవరీకు లెక్కువనియు బండ్రాయులు నిర్హేతుకముగా పోరాడుచున్నారు. ఇంకను అంతశ్శాఖలవారు వారివారిశాఖలయొక్క ఔన్నత్యమును తదితరశాఖల నైచ్యమును సహేతుకముగ గాని నిర్హేతుకముగగాని వెల్లడించుచున్నారు. మరి శాస్త్రానుభవముగల బ్రాహ్మణోత్తములు వైష్ణవులకంటె శైవు లాధిక్యులనియు శైవులకంటె శాక్తేయు లాధిక్యులనియు వీరికంటె సౌరు లెక్కువనియు వీరికంటె గాణాపత్యులే గొప్పయనియు వీరికంటె కాపాలికు లెక్కువనియు ఈమతములన్నియు కల్పించిన స్మార్తమానుగనుక స్మార్తమే యెక్కుడనియు శాస్త్ర దృష్టాంతముల జూపుచు కలహించుచున్నారు. మరియు గీర్వాణవిద్యావిశారదులును సంఘసంస్కర్తలు నగు కొందరు ప్రాజ్ఞులు అద్వైతమతమునందు "అసురాద్వైతు లెక్కువనియు వీరికంటె దేవాద్వైతు లెక్కువనియు ద్వైతు లందరికంటె గొప్పయనియు వీరికంటె విశిష్టాద్వైతులేగొప్పవారనియు నియోగులందరు ఊర్ధ్వపుండ్రముదప్ప చందనాదికములు బెట్టకూడదనియు పత్రికలమూలమునను ప్రకటనపత్రికలమూలమునను వాదవివాదములు జరుపుచున్నారు. కాని పండితులందరొకచోజేరి సభలుజేసి ముఖాముఖి వాదనలుజరిపి ప్రస్తుతమతవివాదములను పరిష్కరించుటలేదు. శాస్త్రపరిశోధనజేసి బ్రాహ్మణు

లీవిధముగానడువవలెను; బ్రాహ్మణేతరులీవిధముగానడువవలెను. బ్రాహ్మణులహక్కు లీవిధముగాయున్నవి; బ్రాహ్మణేతరులహక్కు లీవిధముగా యున్నవి. అస్పృశ్యతావిషయములో శాస్త్రమం దిట్లుండెను. మన మీవిధముగా నడుచుకొనవలెనని నిర్ణయించుటలేదు. గాని ఒకరు “విశిష్టాద్వైతమని” గ్రంధమువ్రాయ దానికి ఖండనమువ్రాసి “విశిష్టాద్వైతఖండనమనియు” మరల మరొకరద్దానికి ముండనమువ్రాసి “విశిష్టాద్వైతఖండనముండన” మనియు మరల ముండనము వేరొకరువ్రాసి “విశిష్టాద్వైతమత ఖండనముండన ముండనమనియును” వ్రాయ మరొకరు దానికి విధ్వంసనము వ్రాసి “విశిష్టాద్వైతమతఖండన ముండన ముండన విధ్వంసనమనియు” నచ్చొత్తించి ఈవిధముగా మతవైషమ్యములను నిమిత్తమాత్రమందు బెంచుచున్నారు. గాని కార్యోన్ముఖులగుట లేదు. ప్రతిశాఖయందును యిట్టిలే కల్లోలములు జరుగుచున్నవి. గాని కర్మ భక్తి యోగ జ్ఞానము మొదలగు యోగములవంక తిరిగియైనా జూచుటలేదు. ఎల్లప్పుడును వాదవివాదములతోనే కాలము గడుపుచున్నారు. శృతిస్మృతిపురాణేతిహాస సూత్రపంచయులైన ద్విజశ్రేష్ఠులే యీవిధముగా పోరాడుచున్నారు. ఇక ద్విజేతరశ్రేష్ఠుల విషయమడుగవలయునా? వారును పత్రికలునిర్మించుచున్నారు. నేమేల జన్నిదములు వేసికొనగూడదనుచున్నారు. సభలుజేసి బహిరంగముగా బ్రాహ్మణులను దూషించుచున్నారు. తమవారిలో బ్రాహ్మద్వేషముదయించుటకుగాను శాస్త్రములోలేని కల్పనాకథలు నాటకములుగా వ్రాయుచున్నారు. మేము ప్రప్రథమమున క్షత్రియులమనియు విశ్వబ్రాహ్మణులమనియు ఆర్యవైశ్యులమనియు ధర్మశాలీలమనియు అనార్యులుగ నెంచబడినారమనియు త్రివిష్టపమునుండి దిగినామనియు ఆదిమాంధ్రులమనియు వారిలోనుండు సూరిజనులు శాస్త్రప్రమాణములు జూపుచు వారివారిహక్కులను నిలుపుకొనుచున్నారు. గాని మనమం

దర మైకమత్యముగా యుండవలెనని సభలుజేయువారు లేరు. మీరు నీచులు మేము గొప్పవారమనుచు సభలుజేయుచున్నారు. భూతగణము లన్నియు సమానములని తెలిసికొనుటలేదు. ఈలాగున వాదవివాదములు జరుగుచున్నవి. ఈవాదములిప్పటివారితో నంతమొందకుండ తరతరములకు ముదివరలో వచ్చునట్లుగా రావలెనని గ్రంథములచ్చొత్తించుచున్నారు.

మతవిషయము ఈలాగునుండగా స్వరాజ్యసమస్యవచ్చినది. ఒకవైపునగాంధిమహాత్ముడుఅస్పృశ్యతానివారణమైనగానైకమత్యముండినగాని స్వరాజ్యము సిద్ధించదనియు ఘంటాపథముగా జెప్పుచున్నాడు. మరొకవైపున మహామ్మదీయులను క్రైస్తవులను హిందువులందు గలుపుటకు నూతనయంత్రములను నిర్మించుచున్నారు. ఒకవైపున వర్ణాశ్రమధర్మములు నిలుపవలెనని ఆందోళనపడుచున్నారు. ఇట్టి సందిగ్ధస్థితిలో సూరిజనులు మౌనభావమువహించుట ధర్మముగాదు. న్యాయశాస్త్రములు శోధించి బ్రాహ్మణబ్రాహ్మణేతరసమస్యను రద్దుజేసి వారివారి ధర్మసందేహములను రద్దుజేయుటకుగాను తాలూకాసభలు మండలసభలు జరుపుచు ముఖాముఖిగా వాదవివాదములు జరిపి అస్పృశ్యతావిషయము ముఖ్యముగా దేల్చి ఐకమత్యము నెలకొల్పుటకుగాను పండితులైన వారలు ఏర్పాటులు జేయగోరుచున్నాము. ముఖ్యముగా సద్యస్కాల సమస్యయైన "అస్పృశ్యతానివారణమును"గురించి పండితజనుల యభిప్రాయములు ఆంధ్రపత్రికద్వారాగాని లేక వారివారి కనుకూలమైన పత్రికలద్వారాగాని దెలియపరుచ గోరుచున్నాను. అస్పృశ్యతాసమస్య దేలినగాని స్వరాజ్యసిద్ధి బొందలేముగాన ప్రాజ్ఞలోక మీవిషయమై గడుంగడు శ్రద్ధవహించి సత్వరస్వరాజ్యసిద్ధికై ప్రయత్నముజరుప వలెనని ప్రార్థించుచున్నాను.

## ప్రధాన పోషకులు.

జిల్లపురపల వెంకటరాఘవేంద్రరావుబహదరుజాగీరుదారుగారు,నవాబుపేట.

రామసింగుగారు, నెల్లుట్లవగైరా సంస్థానముల మానేజరు నెల్లుట్ల.

శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరి స్వాములవారు.

శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్షస్వాములవారు

౫ బొక్కరాజు నరాంకుశరావుదేశముఖుగారు, యాదవరము

## పోషకులు.

౧ శ్రీరామయాంబికాపుస్తకభాండాగారము, లక్ష్మీనర్సాపురం

౨ తంగెడ నరసింహారావుగారు, కరణం, కొర్జంపాడు.

౩ చారబుడ్డి రత్నారెడ్డిపటేలుగారు, న్యాలపోగుల.

౪ లింగాల వెంకటరెడ్డిదేశముఖుగారు, కుందవరము.

౫ నెల్లుట్ల నరసింహారావుగారు, జోనగాం.

౬ యార్లగడ్డ రంగనాయకులు నాయుడుగారు, కారంచేడు.

౭ జాగర్లమూడి కుప్పుస్వామినాయుడుగారు, కారంచేడు.

౮ అల్లాడి లక్ష్మణరావుగారు కరణం, జంగపల్లి.

౯ రంగాచార్యులుగారు, ముక్త్యారు, దేశముఖు, మసీదుపల్లె.

౧౦ శీతలసింగుగారు, మర్చెంటు, నాగవరము.

౧౧ చేకులపల్లి కృష్ణారెడ్డిగారు, కేశవాపురము.

౧౨ సింగిరాజు అమృతరావుగారు, మత్తేదారు, కోన్నె

౧౩ వి. లక్ష్మణసింగుగారు, జోనగాం.

౧౪ జూలూరి వెంకటరత్నముగారు, వకీలు, గుంటూరు.

## సహాయులు.

౧ పట్వారి నారాయణరావుగారు, క్షీరసాగరము.

౨ నెల్లుట్ల నరసింహారావుగారు, చినమడూరు.

౩ నెల్లుట్ల కేశవరావు దేశముఖుగారు, నెల్లుట్ల.

౪ రంగరాజు గోపాలకిషన్‌రావు దేశముఖుగారు, షాపురం

౫ నారాయణరావుగారు, డాశారుపల్లె.

౬ తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణం దుగ్గిరాల

౭ మెదక్ కిషన్‌రావుదేశముఖుగారు, వల్లపల్లి.

౮ నార్నెపాటి వెంకట సుబ్బారావుగారు, నల్లపల్లి.

౯ నరసింహస్వామివారు, యాదగిరి.

౧౦ బీరకాయల రామారావుగారు, రాయగిరి.

౧౧ భాస్కరరాయని వెంకట రామయ్యగారు, వంగపల్లి.

౧౨ శివలెంక రామలింగయ్యగారు, డాక్టరు హనుమకొండ..

౧౩ పిల్లలమర్రి సోమయాజులుగారు, తహశీలుదారు, గురిజాల.

౧౫ జానపాటి బ్రహ్మన్నగారు, ఆక్టింగు కరణం, పాలయపాలెము.

౧౬ చిక్కరాజు మట్టపల్లి రావుగారు, కర్ణం, చెలకుర్తి.

౧౭ శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు, తాలూకాదారు, మిర్యాలగూడెం.

౧౮ సుసుల రామకృష్ణ బ్రహ్మముగారు, చాటపర్రు.

౧౯ కన్నెలూరి నరసింహారావుగారు, ఈలపోర్లు.

# చంద్రికా ముద్రాక్షరశాల

# గుంటూరు

ప్రొప్రయిటరు:—ఈమని భీమశంకరంగారు.

ఇందు సంస్కృతాంధ్ర హూణభాషలయందు దెట్టి గ్రంథము లయిననునిర్దుష్టముగను, నమ్మికముగను, సరసముగను ముద్రింపఁబడును. విజ్ఞులు తమకుఁగలయచ్చుపనులనెల్లఁ బంపుచుండఁ బ్రార్థితులు.

స్వవిషయము. (పత్రికాధిపతి,

ఇయ్యది వైశాఖమాసపత్రిక; కాని జ్యేష్ఠమాసములో మీరు చదువఁగలిగితిరి. కారణమేమన నిప్పటికి ౧౨ సంవత్సరములనుండి యీపత్రికను ముద్రించియిచ్చుచున్నది చంద్రికాముద్రాక్షరశాల. అయ్యది యొకసం॥ క్రింద మత్కార్యకరణసమర్థ కాఁజాలక కొన్ని చిక్కులపాలు కా మఱియొకముద్రాక్షరశాలకేగి పత్రికను ముద్రింపించుకొనవలసివచ్చె. అది బెజవాడయందు. మరలనిప్పుడీచంద్రికాముద్రాక్షరశాల మఱియొకరియధీనమై మంచిస్థితికి వచ్చినదని పత్రిక నిచ్చుటకి మార్చితింగాని ప్రథమావస్థయగుట రథము సరిగా నడచువఱకు నించుకయాలస్యము సహింపవలసివచ్చెను. ప్రెస్సుమాఱినపుడెల్ల డిక్లరేషనీయవలయును. అందులకుఁ గలెక్టరున్నపుడు ప్రింటరును బ్రింటరున్నపుడు కలెక్టరును వీరిరువురున్నపుడు నేనును మువ్వురము నున్నపుడు గుమాస్తాలును లేక నెలలు జరుగవలసివచ్చెను. డిక్లరేషనుగాకుండఁ బత్రికఁ బ్రచురింపఁగూడదు. ఈకారణములచేనైన యాలస్యమునకుఁ జదువరులు సైరింపఁ బ్రార్థితులు. చిన్నయక్షరముల కేసులు రాకుండుటచే రెండునెలలనుండియు నాగరఖండ మముద్రితము. జ్యేష్ఠమాసపత్రిక మొదలదియుఁ బ్రకటింపఁబడియెడి.